

# తిరుప్పావై వైభవం



వటపత్రశాయి పెరుమాళ్, శ్రీవిల్లీపుత్తూర్



'పండితరత్న' డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్వగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విన్నపం

నాలాయిర దివ్య ప్రబంధ వాఙ్మయంలో తిరుప్పావై ప్రబంధానికి గల స్థానం అద్వితీయమైనది అమ్మ సూత్రాలు బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన భగవద్రామానుజులు సైతం ఈ ప్రబంధంలోని అర్థాలను పూర్తిగా గ్రహించి తెలుసుకోవడం అనేది సాధ్యం కాని పని అని అన్నారు. అటువంటి అసమానమైన అర్థ వైభవాన్ని కలిగిన ఈ ప్రబంధం ఎప్పటికప్పుడు నిత్య నూతనంగా భాసిస్తుంది. అందుచేత ఇది రమణీయమైనది. అందువల్లనే, నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధానికి అనేక వ్యాఖ్యానాలు ఉన్నట్లు, ఈ ప్రబంధానికి కూడా పలు వ్యాఖ్యానాలు వెలిశాయి. ఈనాటికీ వెలుస్తూనే ఉన్నాయి.

గత సంవత్సరం ధనుర్మాస సందర్భంగా దాసునకు తిరుప్పావై ప్రబంధాన్నిగూర్చి కలిగిన అనుభవాన్ని కొన్ని శ్లోకాల ద్వారా దాసుడు విజ్ఞాపన చేయడం జరిగింది. వాటిని ఒక గ్రంథ రూపంలో కూర్చే సందర్భం ఇప్పుడు ఏర్పడినది. ఈ చిరు గ్రంథాన్ని ఈ సంవత్సరం ధనుర్మాస సందర్భంగా ఆస్తిక పాఠకుల సన్నిధిలో దాసుడు వినయ పూర్వకంగా సమర్పిస్తున్నాడు. ఇందులో చోటు చేసుకున్న దోషాలను సహృదయ పాఠకులు హృదయపూర్వకంగా మన్నిస్తారని భావిస్తాను. స్వస్తి.

## తిరుప్పావై వైభవం

*1)దిష్ట్యా న స్సముపాగతః వరధనుర్మాసః పునః , శ్రీవ్రతం*
*సోత్సాహం పరిపాలయామ సతతం కృష్ణం స్మరంతో హృది,*
*త్రింశద్గీతిమనోహరాం చ చరమోపాయప్రబోధాత్మికాం*
*గోదోక్తాం కృతిమాదరేణ వచసా సేవామహే ప్రత్యహమ్.*

మన అదృష్టం వల్ల గొప్పదైన ధనుర్మాసం మళ్లీ వచ్చింది. ధనుర్మాస వ్రతాన్ని ఉత్సాహంగా హృదయంలో శ్రీకృష్ణుని స్మరిస్తూ ఆచరిద్దాం. 30 పాశురాలతో అందంగా ఉన్నది. గోదాదేవి అనుగ్రహించినది, చరమోపాయాన్ని బోధిస్తున్నది అయిన తిరుప్పావై ప్రబంధాన్ని ప్రతి దినం అనుసంధానం చేద్దాం.

*2)వ్యాచక్రే శ్రీవ్రతాఖ్యాం మధురతమకృతిం భట్టనాథాత్మజోక్తాం*
*శ్రీమాన్ శ్రీకృష్ణసూరిః నిరుపమవిధయా భవ్యగంభీరవాగ్భిః,*
*తాత్పర్యం తత్ప్రబంధే విశదయతి తరాం తస్య టీకా సమస్తం*
*తస్మాత్ తాం భావయంతో మనసి హి విబుధాః . శ్రీవ్రతేఽర్థం వదంతి.*

పెరియాళ్వార్ ల పుత్రిక అయిన గోదాదేవి అనుగ్రహించిన మధురమైన తిరుప్పావై ప్రబంధాన్ని శ్రీ కృష్ణ సూరి అనే పెరియ వాచ్చాన్ పిళ్ళై సాటి లేని రీతిలో గంభీరమైన మాటలతో వ్యాఖ్యానించారు. ఆ వ్యాఖ్యానం తిరుప్పావై ప్రబంధం లోని తాత్పర్యాన్ని చక్కగా వివరిస్తున్నది . అందువల్ల పండితులు దానిని మనసులో భావిస్తూ తిరుప్పావై ప్రబంధంలోని అర్థాన్ని వివరిస్తారు.

*3)గ్రంథైర్యా షట్సహస్రైః విలసతి వివృతిః శ్రీవ్రతస్యాద్భుతాఽన్యా*
*సాఽసామాన్యాఽపి మాన్యా సకలబుధనుతా సర్వదా సర్వథా చ*
*వ్యాఖ్యేఽపూర్వే జనన్యార్యవరవిరచితే నాతిక్లుప్తే విభాతః*
*సర్వా శ్చైతాః సుధీభిః ప్రవచనసమయే మానసే భావనీయాః*

**తిరుప్పావై వైభవం**

ఆరువేల గ్రంథ పరిమితిలో నాయనార్ రచించిన ఆరాయిరప్పడి అనే ఇంకొక వ్యాఖ్యానం తిరుప్పావై కు ఉన్నది. అది అద్భుతమైనది. అసామాన్యమైనది. పండితులు అందరికీ అన్ని విధాలుగా ఎల్లప్పుడు గౌరవించ దగినది. ఆ విధంగానే జనన్యాచార్యులు అనే పేరు గల తిరునారాయణ పురత్తు ఆయ్ అనే ఆచార్యులు రచించిన ఈరాయిరప్పడి, నాలాయిర ప్పడి అనే రెండు వ్యాఖ్యానాలు తిరుప్పావై కు ఉన్నాయి ఈ వ్యాఖ్యానాలను అన్నిటిని పెద్దలు తిరుప్పావై ప్రవచనం సమయంలో మనసులో పెట్టుకొని వాటిలోని అర్థాలను వివరిస్తారు.

*4)శ్రీమత్కాంచిపుర్స్థాః బుధకులమణయః శ్రీమదణ్ణంగరార్యాః*
*గోపాలాచార్యవర్యాః అపి కులపతయః శ్రీమదప్పలార్యా బుధేంద్రాః*
*ఇత్యేతే శ్రీవ్రతార్థాన్ స్వవరవివృతిభిః భవ్యరీత్యా వివవ్రుః*
*తేషాం సూక్తీః సమగ్రాః సహృదయహృదయం రంజయంతో జయంతి.*

కాంచీనగరంలో నివసించినవారు, పండితులలో గొప్ప వారు అయిన అణ్ణంగరాచార్యస్వామివారు , కులపతులు అయిన గోపాలాచార్యస్వామివారు , మహాపండితులైన అప్పలాచార్య స్వామివారు అనే వీరు అందరూ తమ తమ వ్యాఖ్యలతో తిరుప్పావై ప్రబంధంలోని అర్థాలను చక్కగా విశదీకరించారు. వీరి సూక్తులు అన్నీ సహృదయుల. హృదయాలను ఆనందింపజేస్తూ ప్రకాశిస్తున్నాయి.

*5)స్నానప్రస్తావనార్థో య ఇహ సముదితః శ్రీవ్రతాఖ్యప్రబంధే*
*సోఽయం నారాయణాఖ్యామృతజలనిధౌ గాహ ఏవేతి వేద్యః,*
*ఏవం సర్వాన్ ప్రయోగాన్ ధ్వనిసరణిమిహాశ్రిత్య సమ్యక్ వివవ్రుః*
*వేదాంతార్థానుసారం సువిదితవిషయా అస్మదాచార్యవర్యాః.*

తిరుప్పావై ప్రబంధంలో మాటిమాటికి స్నానం అనే అర్థాన్ని తెలియజేసే నీరాట్టమ్ అనే పదం ప్రయోగింపబడినది. ఈ పదంలోని భావం శ్రీమన్నారాయణుడు అనే అమృత సముద్రంలో అవగాహించడమే అని తెలియాలి. ఈ విధంగా ఈ ప్రబంధంలోని అన్ని ప్రయోగాలను వేదాంతార్థానుగుణంగా అభిజ్ఞులు, అన్ని

విషయాలను చక్కగా తెలిసినవారు అయిన మన పూర్వాచార్యులు చక్కగా వివరించారు.

*6)గోదోక్తశ్రీవ్రతస్థాన్ గగనగిరియతీంద్రా స్వకీయే మనోజ్ఞే*
*వ్యాఖ్యానే స్వాపదేశే శ్రుతిమతరుచిరాన్ సంప్రదాయానురూపాన్,*
*తత్తద్గాథాసు శబ్దైః ప్రకటితవిభవాన్ దివ్యసూరిప్రబోధ*
*న్యాసాద్యర్థాన్ వ్యవృణ్వన్ అనితరసులభప్రక్రియేడ్యానసేకాన్.*

గోదాదేవి అనుగ్రహించి తిరుప్పావై ప్రబంధానికి వానమామలై జీయర్ స్వామివారు ఒక అందమైన స్వాపదేశవ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. అందులో వారు వేదమార్గానికి అనుగుణమైనందున రుచికరమైనవి, సంప్రదాయానికి అనుగుణమైనవి, , ఆయా పాశురాలలోని పదాల ప్రయోగంవల్ల వ్యక్తం అవుతున్న వైభావాన్ని కలిగినవి, తమకు మాత్రమే సాధ్యమైన రీతిలో తెలిపినందున పొగడదగినవి అయిన, 10 మంది ఆళ్వారులను నిద్ర లేపడం, శరణాగతిని తెలుపడం మొదలైన అర్థాలను వివరించారు.

*7)ప్రాప్యః శ్రీపతిరేవ తస్య కరుణా నిర్హేతుకీ సాధనం*
*త్రయ్యంతేషు బహుత్ర సన్మతమిదం జోఘుష్యతే స్పష్టతః,*
*తత్కావ్యే ప్రతిపాదితం సుమధురం గోదోదితే శ్రీవ్రతే*
*తద్బీజం నిగమద్రుమస్య తదిదం భాతీతి సూక్తిర్విదామ్.*

లక్ష్మీ నాథుడే మనకు ప్రాప్యుడు. ఆ స్వామియొక్క సహజమైన కరుణయే సాధనం అనే ఈ గొప్ప సిద్ధాంతం వేదాంతాలలో స్పష్టంగా ఘోషింపబడుతున్నది. ఆ సిద్ధాంతమే గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలో చాలా మధురంగా తెలుపబడింది. అందువల్ల తిరుప్పావై ప్రబంధం వేదాలు అనే వృక్షానికి బీజంవంటిది అని పెద్దల సూక్తి.

# తిరుప్పా వై వైభవం

*8)అస్మిన్ శ్రీవ్రతనామకే కృతివరే కాఽలంకృతిః ముఖ్యతో*
*భాతీత్యర్థవిచారణే సతి కృతే విజ్ఞాయతేఽయం స్ఫుటమ్. ,*
*యేనార్థాంతరముచ్యతే ధ్వనివశాదర్థాంతరన్యాస ఇ*
*త్యాఖ్య స్సోభిమతో విశేషత. ఇహార్యాణాం మహాజ్ఞానినామ్.*

ఈ తిరుప్పావై అనే గొప్ప కృతిలో ఏది ముఖ్యమైన అలంకారం? అనే విషయాన్ని విచారణ చేసినప్పుడు ఈ విషయం స్పష్టపడుతున్న ది. వాచ్యార్థం ద్వారా ఏ సందర్భంలో ఇంకొక అర్థం ధ్వనిద్వారా వ్యక్తం చేయబడుతుందో ఆ సందర్భంలో అర్థాంతరన్యాసాలంకారం ఉన్నదని చెప్పబడుతుంది . తిరుప్పావై ప్రబంధంలో వాచ్యమైన అర్థంవల్ల వేరొక ముఖ్యమైన అర్థం ధ్వనిద్వారా తెలుప బడుతున్న ది కనుక ఈ ప్రబంధంలో అంతట అర్థాంతరన్యాసాలంకారం ఉన్నదని మహా జ్ఞానులైన మన పూర్వాచార్యుల అభిప్రాయం.

*9)అన్యోఽప్యత్ర విభాతి యః పరికరాలంకార ఇత్యుచ్యతే*
*సాభిప్రాయవిశేషణోక్తిభిరసౌ ప్రద్యోతతే సుందరః,*
*వాచ్యార్థాత్ ధ్వనిరేవ ముఖ్యవిషయత్వేనాత్ర యద్భాసతే*
*సర్వాణీహ విశేషణాని బహుధాఽభిప్రాయగర్భాణి చ.*

తిరుప్పావైలో పరికరాలంకారం అనే ఇంకొక అలంకారం కూడా ఉన్నది అని చెప్పవచ్చు. ఏ సందర్భంలో విశేషణాలు అభిప్రాయ పూర్వకంగా , సందర్భానికి అనుగుణంగా ప్రయోగింపబడతాయో, అక్కడ పరికరాలంకారం ఉన్నదని చెప్పబడుతోంది . తిరుప్పావై ప్రబంధంలో వాచ్యార్థం కంటే ధ్వనిరూపమైన అర్థమే ప్రధానం . ఇందులోని విశేషణాలు అన్నీ ఆయా సందర్భాలకు తగిన విధంగా ప్రకాశిస్తున్నాయి . అందుచేత ఈ ప్రబంధంలో పరికరాలంకారం ఉన్నదని చెప్పవచ్చు.

*10)అత్ర ప్రస్తుతవస్తునా ధ్వనిముఖా దప్రస్తుతం వ్యజ్యతే*
*తస్మాత్ ప్రస్తుతపూర్వకాంకురసమాహ్వాఽలంక్రియాపిష్యతే,*
*సూచ్యార్థోఽపి చ సూచిత స్తదిహ సుస్పష్టాఽపరాఽలంక్రియా*
*ముద్రాఖ్యా తదిదం సమస్తమపి సుస్పష్టీకృతం దేశికైః.*

ఈ ప్రబంధంలో ప్రకృతార్థం ద్వారా ధ్వనివల్ల అప్రస్తుతమైన అర్థం వ్యక్తమవుతున్నది కనుక ప్రస్తుతాంకురాలంకారం కూడా ఉన్నదని ఆచార్యుల అభిప్రాయం . ఆ విధంగానే సూచించదగినది అర్థం ఇక్కడ పాశురాలలో సూచింపబడింది గనుక ముద్రాలంకారం కూడా స్పష్టమవుతున్నది అని చెప్పవచ్చు. ఈ విషయాలన్నీ పెద్దలైన ఆచార్యులచే స్పష్టం చేయబడ్డాయి

*11)తత్తద్గాథాసు తత్తత్పదమహిమవశాత్ వ్యజ్యమానాశ్చ రమ్యాః*
*సర్వేఽలంకారభేదాః సరసజనమనః సమ్యగావర్జయంతి,*
*అత్రానేకత్ర దృశ్యా లలితపదమనోజ్ఞోపమా గీతికాసు*
*శ్లేషోదాత్తభ్రమాద్యాః ప్రదదతి నితరా మస్య కావ్యస్య శోభామ్ .*

ఈ తిరుప్పావై ప్రబంధంలో ఆయా పాశురాలలో ప్రయోగింపబడిన ఆయా పదాలలోని అర్థాల ప్రభావం చేత వ్యక్తమవుతున్న అందమైన అలంకారాలు అన్నీ సరసుల హృదయాలను ఆకట్టుకుంటున్నాయి . ఆ విధంగానే ఈ ప్రబంధంలో పాశురాలలో అనేక సందర్భాలలో ప్రయోగింపబడిన లలితమైన పదాల వల్ల అందమైన ఉపమాలంకారం గోచరిస్తున్నది. ఆ విధంగానే శ్లేష, ఉదాత్తం, భ్రాంతి మొదలైన ఎన్నో అలంకారాలు తిరుప్పావై అనే ఈ కావ్యానికి శోభను కలిగిస్తున్నాయి.

*12)సద్విద్యా న్యాసవిద్యా వరదహరసమాఖ్యా చ విద్యా తథాఽన్యా*
*పర్యంకాభిఖ్యవిద్యా శ్రుతిషు సువిదితా సాంఽతరాదిత్యవిద్య*
*ఇత్యాద్యా బ్రహ్మవిద్యా మధురసరణి మాశ్రిత్య గాథాసు సూక్తాః*
*తత్తత్ శబ్దప్రయోగైరితి గురువివృతిః విజ్ఞహృద్యాఽద్భుతా చ.*

## తిరుప్పావై వైభవం

ఈ తిరుప్పావైలో ని పాశురాలలో సద్విద్య, న్యాసవిద్య, దహర విద్య , పర్యంక విద్య అంతరాదిత్య విద్య మొదలైన ఎన్నో బ్రహ్మ విద్యలు మధురమైన రీతిలో ఆయా పదాల ప్రయోగాల ద్వారా చక్కగా చెప్పబడ్డాయి. అనే ఆచార్యులవ్యాఖ్యానం విజ్ఞహృదయాలను ఆనందింప చేస్తున్నది. అది అద్భుతమైనది కూడా.

*13)ఆచార్యాభిమతిః భవాబ్ధితరణే స్యాదంతిమం సాధనం*
*వేదాంతోదితగుహ్య మేతదిహ సంప్రోక్తం కృతౌ గోదయా,*
*విజ్ఞాయైతదిహాస్మదీయగురవః టీకాసు ప్రాదర్శయన్*
*సమ్యక్ తాదృశవాక్యశబ్దవివృతౌ వాత్సల్యపూర్ణా హి తే.*

ఆచార్యాభిమానం అనేది సంసార సాగరాన్ని దాటడానికి ఉత్తమమైన ఉపాయం. వేదాంతాలలో చెప్పబడిన ఈ రహస్యాన్ని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో చక్కగా స్పష్టం చేసింది. ఈ విషయాన్ని తెలిసిన మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యలలో ఆయా పదాల వివరణలో ఈ ఉపాయాన్ని తెలియజేశారు. ఎందుకంటే, వారు మన విషయంలో పరిపూర్ణమైన వాత్సల్యాన్ని కలవారు కదా

*14)శ్రీమద్రామానుజార్యే గురురితి హి పదం భాతి నాన్యత్ర తస్మాత్*
*సోఽయం గోదాప్రబంధోఽపి కథయతితరాం వైభవం సర్వథాఽస్య.*
*ఏతత్ ప్రోచుః రహస్యం స్వమధురవివృతౌ శ్రీమదణ్ణంగరార్యాః*
*తన్వంతోఽత్యంతమోదం బుధజనహృదయేఽనన్యసాధ్యక్రమేణ*

గురువు అనే పదం భగవద్రామానుజులలో మాత్రమే ప్రకాశిస్తున్నది వేరు ఎవరిలోనూ ప్రకాశించడం లేదు . అందుచేత గోదాదేవి అనుగ్రహించిన ఈ ప్రబంధం కూడా భగవద్రామానుజుల వైభవాన్ని చక్కగా తెలుపుతున్నది. ఈ రహస్యాన్ని శ్రీమాన్ అణ్ణంగరాచార్య స్వామివారు తమకే సాధ్యమైన, మధురమైన వ్యాఖ్యానంలో పండితుల హృదయాలను రంజింప చేస్తూ వివరించారు.

*15)గోదా కాలేన పూర్వా హి యతికులపతేః తర్హి తస్యాః కథం స్యాత్*

*జ్ఞాతం రామానుజీయం విభవమితి భవేదత్ర జిజ్ఞాసుశంకా.*
*అత్రైవం స్యాత్ సమాధిః సువిదితసకలాగామివృత్తా హి సా యత్*
*ప్రాదుర్భూతా భువోంశాత్ భువి తదవికలం వేత్తి వక్తుం సమస్తమ్.*

గోదాదేవి శ్రీరామానుజుల కంటే చాలా ముందు అవతరించారు కదా. రామానుజులు ఆమెకు చాలా తరువాత అవతరించారు. అందువల్ల ఏ విధంగా గోదాదేవికి రామానుజుల వైభవాన్ని వర్ణించడానికి సాధ్యం అవుతుంది/అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు. దీనికి ఈ విధమైన సమాధానాన్ని గ్రహించాలి. గోదాదేవి భవిష్యత్తును అంతటినీ తెలుసుకోగలిగినది. ఎందువల్లనంటే, ఆమె భూదేవి అంశతో జన్మించింది కనుక. అందుచేత ఆమె జరుగబోయే విషయాలను అన్నిటినీ ముందుగానే తెలిసికొని చెప్పగలదు కదా.

*16) షష్ఠాదారభ్య గీతాత్ దశ వివిధదశాప్రాప్తగోపీసఖీనా*
*ముద్బోధాదత్ర గోదా దశ వివిధదశాః సూచయామాస యోగే,*
*భూతాద్యా సూరయ స్తే క్రమశ ఇహ దశ ప్రస్తుతా స్వాపదేశ*
*ధ్వన్యర్థస్య ప్రభావాదితి సరసతయా దేశికా ఊచురత్ర.*

తిరుప్పావై ప్రబంధంలో ఆరవ పాశురంనుండి వరుసగా పది పాశురాలలో పది విధాలైన అవస్థలను పొంది, తన చెలికత్తెలైన పదిమంది గోపికలను గోదాదేవి నిద్ర లేపడం ద్వారా యోగ శాస్త్రం లోని పది విధాలైన దశలను సూచించింది. ఆ విధంగానే, పూదత్తాళ్వార్ మొదలైన పదిమంది అళ్వార్లు ఈ పాశురాలలో క్రమంగా స్తుతింపబడ్డారు. ఈ విషయాలను మన ఆచార్యులు స్వాపదేశ వ్యాఖ్యానాలలో అందంగా తెలియజేశారు.

*17) గోపీనాం సుప్రభాతం యదిహ దశసు సంద్రుశ్యతే గీతికాసు*
*స్యాత్తాత్పర్యం కిమస్యేతి మనసి హి భవేదేవ జిజ్ఞాసుప్రశ్నః,*
*శ్రీశ స్సేవ్యో న సాక్షా త్తదమలచరణౌ సేవనీయౌ తదీయాన్*
*అగ్రే కృత్వేతి సిద్ధం నిగమశిరసి యత్ గోదయా సూచితం తత్.*

# తిరుప్పావై వైభవం

ఈ తిరుప్పావై ప్రబంధంలో పది పాశురాల గోదాదేవి పదిమంది గోపికలను నిద్రలేపడం క. నిపిస్తుంది ఈ విధంగా గోపికలనుసుప్రభాతం పాడే క్రమం ద్వారా ఏ విషయం సూచింపబడింది ?అనే ప్రశ్న. జిజ్ఞాసువులకు కలగడం సహజం శ్రీమన్నారాయణుని సాక్షాత్తు మనం ఆశ్రయించకూడదు . ఆ పరమాత్మ శ్రీచరణాలను అతనికి మిక్కిలి ఇష్టులైన భక్తులను ముందుంచుకుని ఆశ్రయించాలి అనే వేదసిద్ధమైన రహస్యాన్ని గోదాదేవి ఇక్కడ సూచించింది.

*18)ఉద్బోధాత్ ద్వారపస్య ప్రదిశతి దయయా వేదనీయం రహస్యం*
*గోదా కిం శ్రీవ్రతేస్మిన్ శ్రుతిమతసకలజ్ఞేయరస్యార్థపూర్ణే*
*ఇత్యత్రాలోచ్యమానే భవతి సువిదితం యత్ శ్రీపదాంభోజయుగ్మం*
*లక్ష్మీనాథస్య సేవ్యం గురుముఖత ఇత్యాగమార్థం దిదేశ.*

గోదాదేవి తిరుప్పావైలోని 16వ పాశురంలో నందగోపుని ఇంటి ద్వారపాలకుని ప్రార్థించడం కనిపిస్తుంది. వేదరహస్యాలు నిండిన తిరుప్పావై ప్రబంధంలో ఈ వృత్తాంతం ద్వారా మనం తెలియదగిన ఏ రహస్యాన్ని గోదాదేవి మనకు సూచించింది? అనే విషయాన్ని ఆలోచించినప్పుడు, లక్ష్మీ నాథుని శ్రీపాదాలను మనం సదాచార్యపూర్వకంగానే ఆశ్రయించాలి అనే వేదార్థం మనకు గోదాదేవి దీని ద్వారా ఉపదేశించింది అని స్పష్టపడుతున్నది.

*18)ఉద్బోధాత్ ద్వారపస్య ప్రదిశతి దయయా వేదనీయం రహస్యం*
*గోదా కిం శ్రీవ్రతేస్మిన్ శ్రుతిమతసకలజ్ఞేయరస్యార్థపూర్ణే*
*ఇత్యత్రాలోచ్యమానే భవతి సువిదితం యత్ శ్రీపదాంభోజయుగ్మం*
*లక్ష్మీనాథస్య సేవ్యం గురుముఖత ఇత్యాగమార్థం దిదేశ.*

గోదాదేవి తిరుప్పావైలోని 16వ పాశురంలో నందగోపుని ఇంటి ద్వారపాలకుని ప్రార్థించడం కనిపిస్తుంది. వేదరహస్యాలు నిండిన తిరుప్పావై ప్రబంధంలో ఈ వృత్తాంతం ద్వారా మనం తెలియదగిన ఏ రహస్యాన్ని గోదాదేవి మనకు సూచించింది? అనే విషయాన్ని ఆలోచించినప్పుడు, లక్ష్మీ నాథుని శ్రీపాదాలను మనం

సదాచార్యపూర్వకంగానే ఆశ్రయించాలి అనే వేదార్థం మనకు గోదాదేవి దీని ద్వారా ఉపదేశించింది అని స్పష్టపడుతున్నది.

*19)నీళాదేవీప్రబోధో విశదయతి తరా మత్ర భవ్యార్థమేనం*
*యః ప్రోక్తం మంత్రరత్నే ఽపి చ మునివివృతం యః పురాణేతిహాసైః,*
*ఈశః సేవ్యః సదా శ్రీసహకరణముఖాదిత్యయం సంప్రదాయే*
*సిద్ధః శ్రీమద్యతీందోః సుమధుర ఇహ. సంవేద్య ఇత్యాహురార్యాః.*

తిరుప్పావై ప్రబంధంలో కనిపించే నీళాదేవి ప్రబోధం మనకు ఒక విలక్షణమైన, పురాణాలలో, ఇతిహాసాలలో ఋషులచే వివరింపబడిన అర్థాన్ని తెలియజేస్తున్నది. ఆ అర్థం ఏమంటే, లక్ష్మీ పురుషకారపూర్వకంగానే భగవంతుని మనం ఆశ్రయించాలి అనే అర్థం శ్రీ రామానుజ సంప్రదాయంలో ప్రసిద్ధమైనది, అదే ఇక్కడ తెలియ దగినది– అని ఆచార్యులు వివరించారు

*20)నందాదీనాం ప్రబోధో గమయతి భగవత్సంశ్రయాత్ పూర్వమేవ.*
*శ్రీమత్తద్భక్తపాదాశ్రయణమపి భవేదిత్యముం జ్ఞేయమర్థమ్.*
*శ్రీమన్నా రాయణశ్రీచరణకమలయోః నిత్యకైంకర్యమేవా*
*స్మాభిః ప్రార్థ్యం భవేదిత్యపి వదతి. చతుర్వింశగాథా స్ఫుటం నః.*

తిరుప్పావై లోని 17 వ పాశురంలో నంద గోపాలుడు , యశోదాదేవి, బలరాముడు ప్రబోధింపడ్డారు. దీనివల్ల భగవంతుని ఆశ్రయించడానికి ముందు భగవద్భక్తుల శ్రీచరణాలను ఆశ్రయించాలి అనే తెలియదగిన అర్థం చెప్పబడింది. ఆ విధంగానే, 24 వ పాశురంలో గోదాదేవి చేసిన మంగళాశాసనం వల్ల మనం చేసే శరణాగతికి ఫలంగా ఆ శ్రీమన్నారాయణుని చరణ కమలాలలో నిత్యకైంకర్యాన్ని ప్రార్థించాలి అనే విషయం స్పష్టం అవుతున్నది.

*21) ధీమంతః కృష్ణసూరిప్రముఖగురువరాః వ్యాక్రియాసు ద్వయార్థాన్*
*ఏతద్గోదాప్రబంధేఽతిచతురవిధయా దర్శయామాసురేవమ్.*

## తిరుప్పావై వైభవం

*తేషు స్థాలీపులాకక్రమత ఇహ మయా సంగ్రహేణైవ కేచిత్*
*క్లుప్తాః జాయేత మోదం సహృదయహృదయేష్వి త్యభిప్రాయపూర్వమ్*

బుద్ధిమంతులైన శ్రీకృష్ణ సూరి మొదలైన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో ద్వయమంత్రం మలో ఉండే అర్ధాలను అన్నీ తిరుప్పావై ప్రబంధంలో ఉన్నవి అని నిరూపించారు. వాటిలో కొన్నిటిని మాత్రమే ఇక్కడ సహృదయుల హృదయాలు ఆనందించు గాక! అనే అభిప్రాయంతో నేను ప్రస్తావన చేశాను.

*22)ఆదౌ సూత్రచతుష్టయేన మునినా శారీరకం సంగ్రహే*
*ణోక్తం యత్ విశదీకృతం హి బహుభిః సూత్రైః తదేవానంతరమ్*
*యచ్ఛాస్త్రం సముదీరితం ప్రథమతః శ్రీగోదయా పంచకే*
*గాథానాం, వివృతం తదేవ హి తతః శిష్టైశ్చ గీతై స్తయా.*

ఆరంభంలో నాలుగు సూత్రాలతో బాదరాయణ మహర్షి శారీరక ఏ మీమాంసాశాస్త్రాన్ని సంగ్రహంగా నిరూపించాడో, దానినే తరువాత అనేక సూత్రాలతో విశదీకరించాడు. ఆ విధంగానే తిరుప్పావై ప్రబంధం ఆరంభంలో ఏ శరణాగతి శాస్త్రాన్ని గోదాదేవి మొదటి ఐదు పాశురాలలో సంగ్రహంగా ప్రస్తావన చేసిందో, దానినే మిగిలిన పాశురాలలో ఆమె వివరించింది. ఈ విధమైన పోలికను శారీరక మీమాంసా శాస్త్రానికి, తిరుప్పావై ప్రబంధానికి మధ్య దర్శించవచ్చు.

*23)మోక్షోపాయఫలే నిరూప్య విశదం శారీరకస్యోత్తరే*
*భాగేధ్యాయయుగేన వత్సలతయా వ్యాసో మహాత్మాబ్రవీత్.*
*శ్రీగోదాజననీ తథైవ వదతి శ్రీమద్వ్రతస్యోత్తరే*
*భాగే పంచదశై రుపాయఫలయోః గీతైః స్వరూపం పరమ్.*

శారీరక మీమాంసాశాస్త్రంలోని ఉత్తర భాగంలో చివరి రెండు అధ్యాయాలలో వ్యాసభగవానుడు ఎంతో వాత్సల్యంతో మోక్షోపాయఫలాలను విశదంగా నిరూపించారు. ఆ విధంగానే, గోదామాత ఎంతో వాత్సల్యంతో తిరుప్పావై ప్రబంధంలోని ఉత్తరభాగంలో గల 15 పాశురాల ద్వారా మోక్షోపాయఫల స్వరూపాల

నిష్కర్షణ చేశారు. ఇటువంటి సామ్యాన్ని శారీరక మీమాం, తిరుప్పావై అనే ఈ రెండిటి మధ్య దర్శించవచ్చు.

*24)బ్రూతే శ్రీపాంచరాత్రం పరవిభవముఖశ్రీశరూపాణి పంచ*
*న్యాసోపాయస్స్వరూపం దిశతి చ విశదం యత్ ప్రపన్నావధేయమ్,*
*ఏవం గోదావ్రతాదౌ క్రమశ ఇహ పరాదీని వ్యక్తం భవేయుః*
*వ్యాఖ్యాతా చ ప్రపత్తిః రుచిరఫణితిభిః వ్యంగ్యపూర్ణాభిరత్ర.*

శ్రీ పాంచరాత్ర శాస్త్రం శ్రీమన్నారాయణుని పరం, వ్యూహం, విభవం మొదలైన ఐదు రూపాలను తెలుపుతున్నది. ఆ విధంగానే ప్రపన్నులు తప్పక తెలియదగిన, న్యాస మనబడే ప్రపత్తియొక్క స్వరూపాన్ని చక్కగా వివరిస్తున్నది. ఆ విధంగానే గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలో కూడా మొదటి అయిదు పాశురాలలో భగవంతుని పరం మొదలైన ఐదు రూపాలు ప్రస్తావించబడ్డాయి. ఈ ప్రబంధంలో చక్కని పద ప్రయోగాలు ప్రపత్తిని వ్యాఖ్యానిస్తున్నాయి. ఆ ప్రయోగాలను మన ఆచార్యులు చక్కగా వివరించారు.

*25)ఆదౌ కారణతోదితా భగవతః శారీరకే , ఽబాధితా*
*సేత్యుక్తా తదనంతరం, తదను తత్ప్రాపకప్రాప్యతే,*
*దృశ్యం శ్రీవ్రతగీతికాస్వపి తథా ప్రోక్తం జగద్ధేతుతా–*
*బాధ్యత్వాదిచతుష్టయం తదుచితైః తైస్తై ప్రయోగైః స్ఫుటమ్.*

శారీరక మీమాంసాశాస్త్రంలో గల నాలుగు అధ్యాయాలు వరుసగా భగవంతుని కారణత్వం , ఆ కారణానికి ఆబాధ్యత్వం, ఆ తర్వాత ఆ భగవంతుని పొందడానికి తగిన ఉపాయాలు, మోక్ష ఫలం తెలుపబడ్డాయి. ఆ విధంగానే తిరుప్పావై ప్రబంధంలో కూడా ఆయా పాశురాలలో ని ప్రయోగాల ద్వారా భగవంతుని జగత్కారణత్వం, దాని అబాధ్యత్వం మొదలైనవి తెలుపబడ్డాయి. ఏ విధంగా అంటే, మొదటి పాశురంలో నారాయణ పదం ద్వారా జగత్కారణత్వం, నాలుగవ పాశురంలో అంతర్యామిత్వం చెప్పడం చేత ఆబాధ్యత్వం, ఇరవై ఎనిమిదవ పాశురంలో ప్రాపకత్వం , ఇరవై

తొమ్మిదవ పాశురంలో ప్రాప్యత్వం చెప్పబడడం గమనించవచ్చు. ఈ విధంగా తిరుప్పావైకు, శారీరక మీమాంసా శాస్త్రానికి మధ్య అందమైన పోలిక వ్యక్తమవుతున్నది.

*26) వార్తా జానశ్రుతీయా ద్విజకథనవశాత్ సూచితా షష్ఠగీత్యా*
*గాథాయామష్టమాయామిహ దహరసమాఖ్యా చ విద్యాప్రసక్తిః*
*ద్వావింశ్యాం గీతికాయాం విలసతి కథితా భవ్యవిద్యా సదాఖ్యా,*
*చైవం భాభాతి గోదాప్రతకృతిరఖిలా వైదికార్థైః ప్రపూర్ణా.*

తిరుప్పావైలోని ఆరవ పాశురంలో పక్షులను ప్రస్తావించడం ద్వారా ఉపనిషత్తులలో ప్రసిద్ధమైన జాన శ్రుతి వృత్తాంతం సూచింపబడింది. ఎనిమిదవ పాశంరంలో "కీళ్వానం మేల్ వానం" అని మొదలైన పదాల ప్రయోగాల ద్వారా దహరవిద్య అనే బ్రహ్మవిద్య సూచింపబడింది. 22 వ పాశురంలో కొండగుహలో నిద్రించే సింహం నిద్రలేచి వచ్చే వృత్తాంతంద్వారా సద్విద్య సూచింపబడింది . ఈ విధంగా గోదాదేవి రచించిన తిరుప్పావై ప్రబంధం పూర్తిగా వైదికమైన అర్థాలతో నిండి ఉన్నది.

*27)విద్యంతేఽనేకప్రబంధాః మృదుమధురపదాః దివ్యసూరిప్రణీతాః*
*కింత్వేతే కిం సమానాః యది నిశితధియాఽలోక్యతే శ్రీవ్రతేన,*
*యేన హ్యధ్యాపితః శ్రీయదుకులతరణిశ్చాపి లోకోపదేష్టా*
*యత్ సోఽయం సంశృణోతి ప్రతిదిన ముదయారాధనే ప్రీతియుక్తః.*

దివ్యసూరులు అనబడే ఆళ్వార్లు అనుగ్రహించిన మృదుమధురమైన పదాలను కల ప్రబంధాలు అనేకం ఉన్నప్పటికీ, నిశితంగా గమనించి చూస్తే, గోదాదేవి రచించిన తిరుప్పావై ప్రబంధంతో ఏవి సాటి కావు. ఎందుకంటే, ఈ తిరుప్పావై ప్రబంధంద్వారా గోదాదేవి లోకానికంతటికీ ఆచార్యుడైన శ్రీకృష్ణునకుసైతం జీవపారార్థ్యాన్ని ఉపదేశం చేసింది. అంతేకాక ఈ ప్రబంధాన్ని ఆ పరమాత్మ ప్రతి దినం ఉదయారాధన కాలంలో ప్రీతిలో ఆలకిస్తున్నాడు.

*28) నిష్ణాతా శ్చాపి శాస్త్రేష్వతికుశలధియః శ్రీవ్రతస్యావగత్యాం*

# తిరుప్పావై వైభవం

*సర్వే ముహ్యంతి, వాచస్పతిరపి న భవేదత్ర సత్యం సమర్థః,*
*కిం త్వద్యేయం మతిర్మే ఽభిలషతి చపలా వక్తు, మేతత్ న చిత్రం*
*లోకే వాంఛంతి సర్వే ఽ ప్యమృతరససమాస్వాదనం కోఽత్ర దోషః.*

అన్ని శాస్త్రాలలో నిష్ణాతులు అయినా, చాలా నిశితమైన బుద్ధిని కలవారైనా, ఎవరు కూడా తిరుప్పావై ప్రబంధంలోని అర్థాలను పూర్తిగా తెలియడంలో సమర్థులు కారు. చివరకు బృహస్పతి కూడా సమర్థుడు కాడు. కానీ, ఇప్పుడు నా ఈ మనసు చాలా చాపల్యాన్ని కలిగినదై, తిరుప్పావై ని గురించి చెప్పాలని కోరుతున్నది. ఈ విషయంలో ఏమీ ఆశ్చర్యం లేదు. ఎందుకంటే, లోకంలో అందరూ కూడా అమృత అమృతరసాన్ని ఆస్వాదించాలని అందరుళకోరుకుంటారు కదా. ఇందులో ఏమి తప్పు ఉన్నది?

*29)స్వామిన్!అష్టాక్షరాఖ్యం మను మవగత్యేమి దాసస్వభావం*
*త్వద్భక్తానాం పదాబ్జేష్వితి జయతి కలిఘ్నా ఖ్యసూరేః సదుక్తిః.*
*సర్వత్ర శ్రీవ్రతేఽస్మిన్న తివిశదతయా భాసతే శేషభావం*
*లక్ష్మీ నాథస్య భక్తేష్వితి సుకృతిరియం మంత్రరాజస్య సారః*

" స్వామీ! నీ అష్టాక్షరీ మహా మంత్రాన్ని తెలిసికొనినేను గ్రహించినది ఏమంటే, నీ భక్తులకు నేను దాసుడనై ఉండడమే " అనే తిరుమంగై ఆళ్వార్ల శ్రీసూక్తి గొప్పగా ప్రకాశిస్తున్నది. తిరుప్పావై ప్రబంధంలో అంతటా ఇటువంటి భాగవతశేషత్వమే స్పష్టంగా ప్రకాశిస్తున్న ది. కనుక ఈ ప్రబంధం అష్టాక్షరీమహామంత్రసారం అని చెప్పదగి ఉన్నది.

*30)గీతాసారతయా విభాతి చరమశ్లోకః తదంతే స్మృతః*
*న్యాసాఖ్యా శరణాగతిశ్చ వివృతా యస్మిన్ ప్రపత్త్యాఖ్యకా,*
*గోదాశ్రీవ్రత మేతదస్య కురుతే వ్యాఖ్యాం సమగ్రాం తతః*
*గీతోక్తాంతిమయోగటీకనతయా గోదావ్రతం శోభతే.*

## తిరుప్పావై వైభవం

భగవద్గీతలో చివర చెప్పబడిన చరమశ్లోకం ఆ గీతకు సారంగా ప్రకాశిస్తున్న ది ఆ శ్లోకంలో న్యాసమని, ప్రపత్తి అని చెప్పబడే శరణాగతి వివరింపబడింది. ఆ శరణాగతిని గోదాదేవి రచించిన తిరుప్పావై ప్రబంధం సమగ్రంగా వివరిస్తున్నది. అందుచేత తిరుప్పావై ప్రబంధం గీతలో చివర చెప్పబడిన న్యాసయోగానికి వ్యాఖ్యాన రూపమై వెలుగుతున్నది.

*31)త్రింశద్గాథాచ్ఛరత్నైః వివిధహరిగుణప్రోతరూపాఽనవద్యా*
*నానాశాస్త్రార్థదీప్తిప్రకరశబలితా కంఠధార్యా సదార్యైః*
*శబ్దార్థాలంకృతీద్ధాఽతిశయితదయయా గోదయా నః ప్రదత్తా*
*మాలేయం శ్రీవ్రతాఖ్యా విలసతు సతతం విజ్ఞవాగ్భిః జగత్యామ్.*

ఈ తిరుప్పావై ప్రబంధం ఒక గొప్ప రత్నాల మాలిక. ఇందులో ఉండే 30 పాశురాలు ముప్పై అందమైన, స్వచ్ఛమైన రత్నాలవంటివి. ఆ పాశురాలనే రత్నాలు భగవంతుని అనేక గుణాలనే దారంతో ఒకటిగా చేర్చబడి అందంగా ప్రకాశిస్తున్నాయి. ఈ మాలిక ఏదోషం లేనిది. ఇందులో స్ఫురించే అనేకశాస్త్రార్థాలు అనే పలు కాంతులవల్ల ఈ మాలిక చిత్రవర్ణాన్ని కలిగినది. ఇది సదా ఆర్యులచే కంఠంలో ధరించదగినది. ఇందులో ఉండే అనేక శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు దీనికి గొప్ప కాంతిని కలిగిస్తున్నాయి . ఎంతో కరుణతో ఈ ప్రబంధాన్ని మనకు గోదామాత అనుగ్రహించింది. అటువంటి ఈ తిరుప్పావై ప్రబంధ విజ్ఞుల సూక్తులతో లోకంలో చక్కగా ప్రకాశించాలి.

*32) త్రింశద్గీతిప్రసూనైః మురహరచరణౌ భట్టనాథస్య పుత్రీ*
*భక్త్యా సంపూజయంతీ సులభతమపథం దర్శయామాస గోదా,*
*తన్మార్గం శింగరార్యో నిజశిరసి ధరన్ శ్లోకరూపైః లతాంతైః*
*త్రింశద్భిః త్వదాంభోరుహయుగళసమర్చాం వినమ్రశ్చకార.*

ముప్పై పాశురాలనే అనే ముప్పై పూలతో శ్రీ కృష్ణపరమాత్మ శ్రీచరణాలను గోదాదేవి అర్చించి లోకానికి ఒక చక్కని మార్గాన్ని చూపించింది . ఆ మార్గాన్ని శిరసా

వహిస్తూ, శింగరాచార్య దాసుడు 30 శ్లోకాలనే పూలలో ఆ గోదాదేవి పాదపద్మాల అర్చనను వినమ్రుడై చేశాడు.

*33) సూర్యాంతర్వర్తిదేవో రవికరవికసత్ పద్మ పత్రాయతాక్షః*
*శ్రీమాన్ భాతీతి వక్తి శ్రుతిషు సువిదితా సాంఽతరాదిత్యవిద్యా,*
*ఆదౌ మధ్యే తథాంతే ప్యము ముపనిషది ప్రోక్తమర్థం బ్రవీతి*
*శ్రీగోదాశ్రీవ్రతాఖ్యా సుకృతిరితి భవేత్ సాంఽతరాదిత్యవిద్యా.*

ఆదిత్య మండలాంతర్వర్తి అయిన శ్రీమన్నారాయణుడు సూర్యునిచే వికసింపచేయబడిన, విశాలమైన, తామరలవంటి కన్నులు కలవాడని ఉపనిషత్తులలో ప్రసిద్ధమైన అంతరాదిత్యవిద్య తెలుపుతున్నది. గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలో కూడా మొదట, మధ్యలో, చివర కూడా ఈ ఉపనిషదర్థం సూచింపబడినందున ఈ ప్రబంధం అంతరాదిత్యవిద్యాస్వరూపం అని చెప్పవచ్చు. మొదటి పాశురంలో" కార్ మేని చ్చెంగణ్"అని, పద్నాలుగవ పాశురంలో "పంగయ క్కణ్ణానై" అని చివరి పాశురంలో "శెమ్ కణ్ తిరుముకత్తు" అని చెప్పడంవల్ల ఈ ప్రబంధంల అంతరాదిత్యవిద్యా స్వరూపమని భావించవచ్చు

*35)పర్యంకాభిఖ్యవిద్యా ప్రవదతి విభవం ముక్తభోగస్య కౌషీ*
*తక్యాం యోక్తా తథైవాప్యధికరణవరే సాంపరాయాభిధానే,*
*సా విద్యా గోదయోక్తా విలసతి నవమే గీతిరత్నే మహార్థా*
*గీత్యాం చైకోనవింశ్యాం సుమధురవచనైః శ్రీవ్రతాఖ్యప్రబంధే.*

వేదంలో కౌషీతకీ ఉపనిషత్తులోను, శారీరక మీమాంసలోని సాంపరాయాధికరణంలోను చెప్పబడిన పర్యంక విద్య ముక్తుని భోగంలోని వైభవాన్ని తెలుపుతున్నది. తిరుప్పావై ప్రబంధంలో గోదాదేవి గొప్ప అర్థాలను వెలువరించే

## తిరుప్పావై వైభవం

ంతూమణిమాడత్తు" అనే తొమ్మిదవ పాశురంలోను, ఆ విధంగానే, చక్కని మధురమైన సూక్తులతో"కుత్తువిళక్కు" అనే 19 వ పాశురంలోను ఈ బ్రహ్మవిద్యను తెలియజేసింది

*36)"సర్వాన్ కామాన్ సదా సోశ్నుత "ఇతి వచనే తైత్తిరీయప్రసిద్ధే*
*వాఖ్యాతం భోక్తృసామ్యం తదిహ సువివృతం శ్రీవ్రతాఖ్యప్రబంధే,*
*యస్మాత్ శ్రీకృష్ణసూరిప్రముఖగురువరాః సాదరం సప్తవింశ్యాః*
*గీతాయాః శ్రీవ్రతాఖ్యే వచనమిద ముదాహృత్య టీకాం వితేనుః.*

"సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" అనే తైత్తిరీయ వాక్యంలో సహశబ్దప్రయోగంద్వారా జీవాత్మ పరమాత్మల భోక్తృసాహచర్యంచెప్పబడింది. ఆ అర్థం గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలో చక్కగా వివరింపబడింది. ఎందుకంటే, శ్రీ కృష్ణ సూరి అనే పెరియవాచ్చాన్ పిళ్ళై మొదలైన మన పూర్వాచార్యులు "కూడారై" అనే 27వ పాశురాన్ని , ఆదరంగా ఈ శ్రుతి వాక్యాన్ని ప్రమాణంగా తీసికొని వ్యాఖ్యానం చేశారు. ఈ పాశురంలో "కూడి ఇరుందు కుళిర్ న్దు" అని శ్రీకృష్ణపరమాత్మతో కలసి గోపికలు పాయసాన్ని భుజించినట్లు చెప్పబడింది కదా . అందుచేత ఈ పాశురం భోక్తృసాహచర్యాన్ని తెలుపుతున్నది అని ఆచార్యుల వ్యాఖ్యానం.

*37)ఈశావాస్యం సమస్తం తదిహ జగతి యత్కించిదిత్యాహ వేదః*
*సేశావాస్యాఖ్యవిద్యా స్ఫురతి హి దశమే భవ్యగీతేఽర్థశక్త్యా,*
*శబ్దాన్నా రాయణేతి ధ్వనతి భగవత స్సర్వతో వ్యాపకత్వం*
*తస్మిన్ గీతే ప్రయుక్తాదితి వివృతిరిహ స్మర్యతామ్ దేశికానామ్.*

ఈ లోకంలో ఉండే ఈ చరాచర వస్తువులన్నీ పరమాత్మచేత వ్యాపింప బడినవి అని వేదం తెలుపుతున్నది . దీనికే ఈశావాస్య విద్య అని పేరు. ఈ విద్య తిరుప్పావై ప్రబంధంలో ఉండే పదవ పాశురంలో అర్థవశంచేత ధ్వనిస్తున్నది. ఈ పాశురంలో "నాట్ర త్తుళాయ్ నారాయణన్" అనే నారాయణశబ్దం ప్రయోగింపబడడం ద్వారా భగవంతుని సర్వత్ర వ్యాపకత్వం తెలుపబడుతున్నదని ఇక్కడ ఆచార్యులు అనుగ్రహించిన

వ్యాఖ్యానాన్ని స్మరించాలి. అందుచేత ఈ పదంలో ఈశావాస్య విద్య సూచింపబడినదని చెప్పవచ్చు

*38)బ్రహ్మర్షిః యాజ్ఞవల్క్యో "యమయతి పృథివీ మంతరో యస్స ఆత్మే "*
*త్యంతర్యామీతి విద్యాం కథయతి బృహదారణ్యకే సుప్రసిద్ధామ్*
*సైషా గీత్యాం చతుర్థ్యాం జలముచి భగవద్వాచకస్య ప్రయోగాత్*
*వ్యక్తేతి ప్రాహురార్యాః శ్రుతియుగళశిరోవిత్తమాః శ్రీవ్రతేఽస్మిన్.*

బృహదారణ్యకోపనిషత్తులో బ్రహ్మర్షి అయిన యాజ్ఞవల్క్య మహర్షి "యః పృథివ్యాం తిష్ఠన్ యః పృథివ్యా అంతరో యం పృథివీ న వేద యస్య పృథివీ శరీరం యః పృథివీమంతరో యమయతి ---ఏష త ఆత్మాంతర్యామ్యమృతః" అని మొదలైన వాక్యాల ద్వారా భగవంతుడే చేతనా చేతనాలు అన్నిటిలో అంతర్యామిగా ఉన్నాడని, అటువంటి రూపంలో భగవంతుని ఉపాసించేవాడు అమృతత్వాన్ని పొందుతాడనే అంతర్యామి విద్యను ఉద్దాలక మహర్షికి ఉపదేశించాడు. ఈ విద్య తిరుప్పావై ప్రబంధంలోని నాలుగవ పాశురంలో సూచింపబడింది అని చెప్పవచ్చు. అక్కడ మేఘాన్ని సంబోధించేటప్పుడు "ఆళిమళైక్కణ్ణా" అని మేఘంలో భగవంతుడు అంతర్యామిగా ఉన్నాడు అని అర్థం వచ్చేటట్లు ప్రయోగింపబడినది. ఇంతేకాక, ఈ పాశురంలో భగవంతుని అంతర్యామి దశ సూచింపబడింది అని కూడా పెద్దలు వ్యాఖ్యానించారు.

*39)అన్యత్ పశ్యతి యత్ర నైవ, న శృణోత్యన్యన్న జానాతి చే*
*త్యాద్యుక్త్యా ప్రతిపాదితా భవతి యా భూమాఖ్యవిద్యాఽగమే,*
*సా గీతే నవమే స్ఫుటా వచనతో గోప్యాః "సుతా తే భవేత్*
*మూకా వా బధిరాఽథ మంత్రవశతో మోహం గతే"త్యాదితః.*

## తిరుప్పావై వైభవం

చాందోగ్యోపనిషత్తులో "యత్ర నాన్యత్ పశ్యతి నాన్యత్ శృణోతి నాన్యత్ విజానాతి స భూమా" అని భగవదనుభవాన్ని పొందినవాడు వేరొక విషయాన్ని చూడడు, వినడు తెలియడు, కనుక ఆ భగవంతుడు భూమా అనే శబ్దంచేత చెప్పబడుతున్నాడు– అని భూమా విద్య చెప్పబడింది తిరుప్పావై ప్రబంధంలోని తొమ్మిదవ పాశురంలో "ఉన్ మకళ్ తాన్ ఊమైయో?అన్ఱి చ్చెవిడో ?అనందలో?" (అత్తా! నీ కుమార్తె మూగదా? లేక, చెవిటిదా? )ఇత్యాదిగా గోపిక పల్కిన సూక్తి ద్వారా ధ్వనిస్తున్నది.

*40)"ఏతద్వై సత్యకామ ప్రణవ ఇహ పరం చాపరం బ్రహ్మ, తస్య
త్రేధోపాసే" తి విద్యాం ప్రణవపదయుతాం పిప్పలాదో జగాద,
గీతే సా పంచవింశే సునిశితమతిభిః భావనీయా వ్రతేఽస్మిన్
తత్తచ్ఛబ్దేషు నద్ధాదతికుశలతయా గోదయౌకారవర్ణాత్.*

ప్రశ్నోపనిషత్తులో ప్రస్తావింపబడిన వృత్తాంతం ప్రకారం పిప్పలాదుడు అనే మహర్షి సత్యకామునకు ప్రణవోపాస్య బ్రహ్మవిద్యను ఉపదేశించాడు . ఓంకారమే పరం బ్రహ్మ, అపరం బ్రహ్మ కూడా. ఈ ప్రణవాన్ని ఏకమాత్రగా ఉపాసిస్తే ఈ లోకంలో ఆ ఉపాసకుడు శక్తిని కలవాడై, మరణానంతరం మళ్లీ మనిష్యలోకాన్ని చేరుతాడు. అప్పుడు మళ్లీ బ్రహ్మను ఉపాసిస్తే బ్రహ్మ సాయుజ్యాన్ని చేరుతాడు. రెండు మాత్రలను కల ప్రణవాన్ని ఉపాసిస్తే ఉర్ధ్వలోకాలలో పుణ్యఫలాలను అనుభవించి తిరిగి ఈ లోకానికి వస్తాడు. మూడు మాత్రలను కలిగిన ప్రణవాన్ని పరబ్రహ్మ స్వరూపంగా ఉపాసిస్తే , అతడు సూర్యుని చేరి, పాపాలను పోగొట్టుకుని, పరమాత్మను చేరుతాడు అని ఈ విధంగా ప్రణవవిద్యను పిప్పలాదుడు ఉపదేశించాడు. ఈ విద్య తిరుప్పావై ప్రబంధంలో ఇరవై ఐదవ పాశురంలో సూచింపబడింది అని చెప్పవచ్చు. ఓకే మాత్రను కల ఓకారం "ఒరుత్తి మగనాయ్" అనే ఆరంభపదంలో , రెండు మాత్రలను కలిగిన ఓకారం "ఓరిరవిల్ "అనే పదంలో, మూడు మాత్రలను కల ఓకారం "అరుత్తిత్తి వందోమ్" అనే పదంలో చివర . ప్రయోగింపబడినవి. అందుచేత ఈ విధంగా ఈ పాశురంలో ఏకమాత్ర, ద్వమాత్ర,

త్రిమాత్రలను కల ఓకారం ప్రయోగింపబడినందున ప్రణవోపాస్య బ్రహ్మవిద్య శబ్దతః సూచింపబడింది అని చెప్పవచ్చు. ఇటువంటి రీతిలోనే తిరువాయ్ మొళి ప్రబంధంలో నాలుగవ శతకంలోని" ఒరు నాయకమాయ్ "ఇత్యాది ఆరంభ పాశురంలో ఈ ప్రణవవిద్య శబ్దతః సూచింపబడింది అని పెద్దల అభిప్రాయం.

*41) ప్రాప్యప్రాపకబుద్ధితో భగవతః సంసేవనం పాదయోః*
*ఖ్యాతో న్యాస ఇతి త్రయీశిరసి తత్ సర్వోత్తమం సాధనమ్,*
*తత్ప్రోక్తం మధురోక్తిభిః సువిశదం ప్రారంభగీతే తథై*
*వాంతే గీతయుగే త్రయీహృదయసంవాద్యాత్మకే శ్రీవ్రతే.*

భగవంతుని శ్రీచరణాలే ప్రాప్యం, ప్రాపకం అనే బుద్ధితో ఆ స్వామి రెండు పాదాలను ఆశ్రయించడం న్యాసమని వేదాంతంలో చెప్పబడింది . "తస్మాత్ న్యాసమేషాం తపసామతిరిక్తమాహుః" అని వేదం ఈ న్యాసం ఉత్తమమైన మోక్షోపాయమని కూడా తెలిపింది. న్యాసమనే ఈ బ్రహ్మవిద్య వేదాంత తాత్పర్యాన్ని అనుసరించి పలికే తిరుప్పావైలో చాలా మధురంగా ప్రారంభ పాశురంలో, చివరిలో 28వ, 29వ పాశురాలలో ప్రతిపాదించబడింది.

*42)సందేహో జాయతేఽయం కథమివ భగవత్పాదవిన్యస్తభారైః*
*కశ్చిద్యత్నో విధేయో వ్రతమితి భవతీత్యత్ర నో మానసేషు,*
*అత్రైషా స్యాత్సమాధిః రుచిరసవధికా సేవనే శ్రీపతేర్యా*
*ప్రాప్త్యైషా హ్యార్తచిత్తం త్వరయతి హి తతో న స్వరూపస్య హానిః.*

తిరుప్పావై వ్రతం చేయడం అనేది కూడా ప్రపన్నునకు స్వప్రయత్నంలోకి చేరుతుంది కదా . భగవంతుని చరణాలలో రక్షణ భారాన్ని సమర్పించిన ప్రపన్నునకు స్వప్రయత్నం అనేది తగదు కదా. మరి, ఏ విధంగా ఈ వ్రతం ఆచరణీయం? అనే ప్రశ్న సహజంగా ఇక్కడ కలుగవచ్చు. అయితే, దీనికి సమాధానం ఏమంటే, భగవంతుని

పాదాలలో సేవ చేయాలి అనే అంతు లేని రుచి అనేది ఆర్తప్రపన్నుని స్వరూపంలోకి చేరుతుంది. ఈ విధమైన రుచి ఆర్తుల చిత్తాన్ని వ్రతాదులను ఆచరించేటట్లు తొందర చేస్తుంది. ఈ రుచి, త్వరలు స్వరూపానికి తగినవే. అందువల్ల తిరుప్పావై వ్రతాన్ని ఆచరించడంలో మన స్వరూపానికి ఏ హానీ లేదు.

*43)సర్వత్ర శ్రీవ్రతేఽస్మిన్ యతినృపతికథాః స్మారితాః తాదృశోక్తి*
*స్వారస్యేనేతి పూర్వే ధ్వనిసరణిచణాః దేశికాః ప్రబ్రువంతి. ,*
*అత్రాష్టావింశగాథావివరణసమయే వ్యాకృతౌ కృష్ణసూరేః*
*వృత్తాంతః ప్రస్తుతో యః సహృదయహృదయాకర్షకః సోఽవధేయః.*

ఈ తిరుప్పావై ప్రబంధంలో అంతటా ఆయా పాశురాల్లో ప్రయోగింపబడిన ప్రయోగాల స్వారస్యాన్ని బట్టి పలు భగవద్రామానుజుల వృత్తాంతాలు సూచింపబడ్డాయి అని ధ్వనిరూపమైన అర్థాలను తెలుపడంలో ప్రవీణులైన పూర్వాచార్యులు అన్నారు. ఇక్కడ తిరుప్పావై ప్రబంధ లోని 18 వ పాశురాన్ని శ్రీకృష్ణ సూరి వ్యాఖ్యానిస్తూ భగవద్రామానుజులు ఈ పాశురాన్ని అనుసంధానం చేసుకుంటూ భిక్ష కోసం పెరియ నంబి గారి ఇంటికి వెళ్ళినప్పుడు వారి కుమార్తె భిక్షను సమర్పించడం కోసం తలుపులు తీసి బయటకు రాగా, ఆమెను చూచి సాక్షాత్తు నీలాదేవి వచ్చిందని తలచి , ఆమెకు శ్రీరామానుజులు నమస్కరించిన వృత్తాంతాన్ని ప్రస్తుతించడం ఒక ఉదాహరణగా గమనించాలి.

*44)శ్రీమన్నారాయణశ్రీపదకమలయుగే. న్యస్తరక్షాభరాణాం*
*సర్వే యజ్ఞా స్సమాప్తాః న హి కిమపి పరం విద్యతే కృత్యశేషమ్,*
*కింత్వేకం శ్రీవ్రతం నః వ్రతమపర మిహైకాదశీనామ చోక్తం*
*కర్తవ్యం తత్ర మానం భవతి హి సమయః సాత్త్వికానాం వచశ్చ.*

శ్రీమన్నారాయణుని పాదపద్మాలు రెండిటిలో తమ రక్షణ భారాన్ని సమర్పించిన ప్రపంన్నులకు చేయవలసిన కర్తవ్యాలను అన్ని పూర్తి అయ్యాయి. ఏ విధమైన యజ్ఞయాగాలు వారు చేయనక్కరలేద. వారు చేయవలసిన మిగిలిన కర్తవ్యం ఏదీ

లేదు. కానీ, ప్రపన్నులు రెండు వ్రతాలను మాత్రం తప్పక ఆచరించాలి. అందులో ఒకటి తిరుప్పావై వ్రత. రెండవది ఏకాదశీ వ్రతం. ఈ విషయంలో ఏమి ప్రమాణం? అంటే, సాత్వికులైన భగవత్ భక్తుల ఆచారం, సూక్తి.

*45) జిజ్ఞాసుప్రశ్న ఏకః మనసి సముదియాత్ కః పునః సాత్వికః స్యా*
*దిత్యేవంరూపతో నో దదురిహ గురవః తత్సమాధాన మిత్థమ్,*
*నిత్యం గోవిందరూపానుభవ పరవశస్వచ్ఛచిత్తాభ్య ఆభ్యో*
*గోపీభ్యః సాత్వికోఽన్యః క ఇహ భువి భవేత్, తేన తా అత్ర మానమ్.*

ఇక్కడ ఒక జిజ్ఞసు ప్రశ్న మన మనసులో కలుగవచ్చు. సాత్వికుడు అంటే ఎవరు? ఎవరి ఆచార ఆచారాన్ని మనం ప్రమాణంగా గ్రహించాలి? అనే ఒక ప్రశ్న మనసులో కలుగవచ్చు. దీనికి పూర్వాచార్యులు ఈ విధంగా సమాధానం ఇచ్చారు. నిత్యం గోవిందుని రూపాన్ని ధ్యానించి అనుభవించడం చేత
పరవశమైన, స్వచ్ఛమైన మనసును కలవారు అయిన గోపికల కంటే సాత్వికులు ఎవరు ఉన్నారు? కనుక ప్రపన్నులు తప్పక తిరుప్పావై వ్రతం ఆచరించాలి అనే విషయంలో ఏ సందేహం లేదు.

*46)శబ్దో నారాయణాఖ్యో గమయతి వివిధానర్థభేదాన్ త్రివారం*
*గీతాస్వత్ర ప్రయుక్తో హృదయ మతితరాం రంజయన్ భావుకస్య,*
*ఆదౌ స్వామిత్వముక్తం తదను నిగదితం వత్సలత్వం తథాంతే*
*సర్వత్ర వ్యాపకత్వం కథితమిహ తతో హ్యర్థభేద స్త్రయాణామ్.*

తిరుప్పావై ప్రబంధంలో మొదటి పాశురంలో, 7 వ పాశురంలో, ఆ విధంగానే పదవ పాశురంలో నారాయణ శబ్దం మూడు సార్లు ఉపయోగించబడింది. మూడు చోట్ల ప్రయోగింపబడిన ఈ నారాయణ శబ్దం మూడు విధాలైన అర్థాలను ఇస్తూ సహృదయుల మనసును ఆనందింపజేస్తున్నది. మొదటి పాశురంలోగల నారాయణ పదం స్వామిత్వాన్ని, ఏడవ పాశురంలోని నారాయణ పదం వాత్సల్యాన్ని పదవ పాశురంలోని నారాయణ పదం వ్యాపకత్వాన్ని తెలుపుతున్నవి . ఈ విధంగా ఈ మూడు చోట్ల ఉండే

నారాయణపదం మూడు విధాలైన వేరు వేరు అర్థాలను తెలుపడం స్పష్టం అవుతున్నది.

*47) ఆదౌ సత్సంగలాభ, స్తదను హరిగుణాలాపనం తై సమేత్య,*
*జ్ఞానానుష్ఠానపూర్ణ ప్రథితగురుపదాంభోజయోః సేవనం చ,*
*లక్ష్మీ పాదాబ్జయుగ్మా శ్రయణసహకృతశ్రీశపాదప్రపత్తిః*
*సేవా తస్యేతి శాస్త్రక్రమ మిహ దిశతి శ్రీవ్రతాఖ్యప్రబంధః.*

మొదట భాగవతులతో సహవాసం, ఆ తరువాత వారితో కలసి భగవద్గుణకీర్తనం, ఆ తరువాత జ్ఞానాన్ని, ఆచారాన్ని పరిపూర్ణంగా కలిగిన సదాచార్యుని పాదాలను ఆశ్రయించడం, ఆ తర్వాత లక్ష్మీదేవిని పురుషకారస్వరూపిణిగా ఆశ్రయించడం, ఆ పిమ్మట భగవంతుని పాదాలను ఆశ్రయించి ఆ స్వామికి సేవ చేయడం అనే ఈ శాస్త్రక్రమాన్ని తిరుప్పావై ప్రబంధంలోని పాశురాలు తెలుపుతున్నవి.

*48)ఆద్యే నారాయణోక్త్యా యదిహ యదుకులోత్తంసభూతే పరత్వం*
*ప్రోక్తం కృష్ణే, తదంతే పదయుగఘటనాత్ వ్యాకృతం భాతి సమ్యక్,*
*గీతేంఽత్యే మాధవేతి ప్రథమ మథ పదం కేశవేతి ప్రయుక్తం*
*తద్వ్యుత్పత్తిః పరత్వం విశదయతి హరౌ ఆద్యగీతాప్రసక్తమ్.*

ఈ తిరుప్పావై ప్రబంధంలో అంతట ఆయా పాశురాలలో శాస్త్రక్రమంలో వివరణవివరణి భావం భాసిస్తున్నది. ఉదాహరణకు, మొదటి పాశురంలోప్రయోగింపబడిన నారాయణపదం శ్రీకృష్ణుని పరత్వాన్ని తెలుపుతున్నది. ఈ పరత్వాన్ని చివరి పాశురంలోని మాధవ, కేశవ అనే పదాలు రెండు వివరిస్తున్నవి. మాధవశబ్దానికి లక్ష్మీవల్లభుడు అని అర్థం. లక్ష్మీపతిత్వం పరత్వానికి సూచకం. ఆ విధంగానే, కేశవనామం బ్రహ్మరుద్రులకు కారణమైనవాడు అనే అర్థాన్ని చెబుతున్నది .

అందువల్ల ఇది కూడా పరత్వసూచకమే. ఈ విధంగా మొదట నారాయణనామంతో సూచింపబడిన శ్రీకృష్ణుని పరత్వాన్ని చివరి పాశురంలోని కేశవ మాధవ నామాలు రెండు వివరిస్తున్నాయి. ఇటువంటి శాస్త్రీయమైన వ్యాసనమాసక్రమాన్ని చాలా పాశురాలలో గమనించవచ్చు

*49) ద్వితీయాకేఽత్ర గీతే మురహరపదయోః కీర్తనా ప్రస్తుతాఽసీత్*
*అంత్యే కేశస్తవోఽతః స్తుతిరియ మమలాఽపాదకేశాంతరూపా,*
*యుక్తః స్తోత్రక్రమోఽయం పదసవిధనతః పశ్యతి స్వామిపాదౌ*
*ఆదౌ వంతే శిరశ్చేతి నయ ఇహ సమన్వేతి శాస్త్రానుసారమ్*

శ్రీ తిరుప్పావై ప్రబంధంలోని రెండవ పాశురంలో " పరమనడి పాడి" అని భగవంతుని పాదాల కీర్తనం ప్రస్తావింపబడింది. చివరి పాశురంలో "కేశవనై" అని కేశసౌందర్యం ప్రస్తుతింపబడింది. మధ్యలో పలు పాశురాలలో భగవంతుని నేత్రవర్ణన, "పంగయక్కణ్ణానై" అని, "తడక్కైయన్" అని బాహువుల మొదలైన మిగిలిన దివ్యాంగాల వర్ణన చేయబడింది. అందుచేత ఈ ప్రబంధం ఆపాదకేశాంత వర్ణనరూపమైన ప్రబంధం అని చెప్పవచ్చు. ఈ స్తుతిక్రమం ప్రపన్నుల విషయంలో చాలా యుక్త మైనది. ఎందుకంటే, భక్తుడు మొదట స్వామి పాదాలను, క్రమంగా మిగిలిన అంగాలను , చివరలో ముఖాన్నికదా దర్శిస్తాడు. ఈ విధమైన శాస్త్రన్యాయం కూడా ఈ ప్రబంధంలో చక్కగా అన్వయిస్తుంది.

*50) ఆరాధ్యాచార్యమాదౌ తదను భగవతః కార్యమారాధనం తత్*
*శ్రీసేవాపూర్వకం స్యాదితి దిశతి విధిం పాంచరాత్రాగమో నః,*
*తత్సర్వం శ్రీవ్రతేస్మిన్ పరమకరుణయా గోదయా సూపదిష్టం*
*స్వానుష్ఠానేన మాత్రా సకలజనసముజ్జీవనం భావయంత్యా.*

మొదట స్వాచార్యుల ఆరాధన చేసి, ఆ తరువాత లక్ష్మీదేవిని ఆరాధించి, ఆ పిమ్మట భగవంతుని ఆరాధన చేయాలి అనే విధిని పంచరాత్ర శాస్త్రం మనకు ఉపదేశిస్తున్నది . ఆ విధానాన్ని అంతటిని తిరుప్పావై ప్రబంధంలో గోదా మాత చాలా కరుణతో తన అనుష్ఠానంద్వారా సకల జనులకు ఉజ్జీవనం కలగాలి అనే భావన కలిగినదై చక్కగా ఉపదేశించింది. తిరుప్పావై ప్రబంధంలోని16వ , 17 వ పాశురాలలో ఆచార్యుల ఆరాధన, పద్దెనిమిది, పంతొమ్మిది మొదలైన పాశురాలలో లక్ష్మీ ఆరాధన, ఆ విధంగానే "కుత్తు విళక్కెరియ" మొదలైన పాశురాలలో భగవదారాధన సూచింపబడడం గమనించవచ్చు. తిరుప్పావై ప్రబంధం అనుష్ఠానరూపమైన ప్రబంధం గనుక, గోదాదేవి ఈ శాస్త్రార్థాన్ని తన ఆచరణ ద్వారా ఉపదేశించినట్లు అయినది.

*51)ఏకాంతీ గ్రామవంశాదికపదఘటితైః నామభిః నైవ వాచ్యో*
*నిర్దేశ్యో విష్ణునైవేతి విహిత పరమైకాంతిశాస్త్రార్థ మేనమ్,*
*గోదా గీతే చతుర్థే మహితజలదసంబోధనే ద్వారపాల*
*స్యాహ్వాత్యాం షోడశే చ ప్రదిశతి మధురం శ్రీవ్రతాఖ్యప్రబంధే.*

ఏకాంతి అయిన (భగవంతుని మాత్రమే ఆరాధించే) భక్తుని అతని గ్రామం, వంశం, మొదలైన పదాలతో కూడిన నామాలతో పిలువకూడదు. విష్ణు హనామాలను పురస్కరించుకుని పిలవాలి అనేది పరమైకాంతిశాస్త్రవచనం. ఈ గొప్ప శాస్త్రార్థాన్ని గోదాదేవి 4వ పాశురంలో మేఘాన్ని సంబోధిస్తూ "ఆళిభళైక్కణ్ణా!" అని భగవంతుని నిర్దేశించే నామంతో సంబోధించింది . ఆ విధంగానే, 16వ పాశురంలో భగవంతుని ఆలయాన్ని కావలి కాచే సేవను చేసే ద్వారపాలకునికూడా అతడు చేసే కైంకర్యాన్ని తెలియజేసే "కోయిల్ కాప్పానే, తోరణవాశల్ కాప్పానే" అనే సంబోధనలతో పిలిచింది. ఈ విధంగా ఇటువంటి మనం తెలుసుకోదగిన అర్థాన్ని గోదాదేవి మనకు ఉపదేశింటకటటఖకచింది.

*52)బ్రహ్మ త్రేధా సమింధే పరమథ విభవం వ్యూహరూపేణ చేతి*

## తిరుప్పావై వైభవం

*ప్రోక్తం శ్రీపాంచరాత్రే ప్రథితమతమిదం నామభాష్యోదితం చ,*
*ఏతత్సిద్ధాంతరీత్యా భణతి హి నిపుణోక్త్యా పరం రూపమాద్యే*
*గీతే వ్యూహం ద్వితీయే విభవమపి తథా పంచమే గోదయాత్ర.*

భగవంతుని రూపాలు పరం, వ్యూహం విభవం అని మూడు విధాలు అని పాంచరాత్ర శాస్త్రం తెలుపుతున్నది. ఈ సిద్ధాంతాన్ని పరాశర భట్టర్ సహస్రనామభాష్యంలో ఉదాహరించారు కూడా. ఈ క్రమాన్ని అనుసరిస్తూ గోదాదేవి చాలా నిపుణంగా తిరుప్పావై ప్రబంధంలోని మొదటి పాశురంలో
నారాయణ శబ్దంతో పరరూపాన్ని , రెండవ పాశురంలో "పాఱ్కడలుళ్ పైయిల్ తుయిన్ఱ పరమన్" అని వ్యూహరూపాన్ని , " వడ మధుర మైందనై" అని విభవ రూపాన్ని ప్రస్తావన చేసింది. ఇక్కడ విష్ణుపురాణంలోని "ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్" ( ఈ శ్రీమన్నారాయణుడు పాలకడలిని తన నివాసంగా కలవాడై , ఆదిశేష పర్యంకాన్ని విడిచి పెట్టి మధురానగరానికి వచ్చాడు )అనే శ్లోకంలోని క్రమాన్ని అనుసరించి గోదాదేవి పలికింది అని పెద్దల వ్యాఖ్యానం

*53) భవ్యార్థాలంకృతీద్ధే సుమహతి కలితే గోదయా శ్రీవ్రతేఽస్మిన్*
*ద్వావింశ్యాం గీతికాయాం హరినయననుతౌ సోపమా సంప్రయుక్తా*
*బ్రహ్మానందేన తుల్యాం విబుధహృది ముదం సద్య ఏవ ప్రదత్తే.*
*వాచోఽతీతాం చ శోభాం జనయతి పరమా మత్ర కావ్యేఽతిరమ్యే.*

గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధం మనోహరంగా ఉండే ఎన్నో అలంకారాలతో భాసిస్తున్నది. విశేషించి, 22వ పాశురంలో, శ్రీకృష్ణుని నేత్రసౌందర్యాన్ని వర్ణించే సందర్భంలో , గోదాదేవి"కింకిణి వాయ్ చ్చెయ్ ద తామరైప్పూప్పోలే శెంగణ్" అని అంటూ ఆ స్వామి నేత్రాలకు తామర పూలు ఉపమానంగా పలికి, ఆ తామర పువ్వులకు కూడా అర విచ్చుకున్న మువ్వలను ఉపమానంగా పలకడం ఒక అపూర్వమైన , ఉపమితోపమ అనే అలంకారంలోకి పర్యవసిస్తుంది. ఇటువంటి ప్రయోగం మనకు ఇంక ఎక్కడా కనిపించదు. ఈ అలంకారం సహృదయుల హృదయాలలో బ్రహ్మానందంతో

సమానమైన, గొప్ప ఆనందాన్ని వెంటనే కలిగిస్తున్నది. వర్ణించడానికి సాధ్యం కాని గొప్ప శోభను ఈ ప్రబంధానికి కలిగిస్తున్నది .

*54)స్వీకారః స్వగత స్తథా పరగతశ్చేతి ద్విధా కథ్యతే*
*ముఖ్య స్తత్ర పరో, యతో హి భగవాన్ స్వామి తదీయా వయమ్,*
*ద్వావింశ్యాం శ్రుతిసార ఏష నిహితః పాపాద్విముక్తా వయం*
*స్యామ, త్వం యది వీక్షసే కరుణయేత్యుక్త్యాऽత్ర గోదావ్రతే.*

స్వగత స్వీకారం, పరగత స్వీకారం అని అని స్వీకారం రెండు విధాలు. జీవుడు స్వయంగా పరమాత్మను ఆశ్రయించడం స్వగత స్వీకారం అని, ఆ పరమాత్మ జీవుని స్వీకరించడం పరగత స్వీకారం అని పేరు. ఈ రెండిటిలో పరగత స్వీకారం ముఖ్యం. ఎందుకంటే, భగవంతుడు స్వామి, మనం అతనికి చెందినవారం. తిరుప్పావై ప్రబంధంలో ఈ వేదాంత సారం 22 వ పాశురంలో తెలుపబడింది. ఈ విషయాన్ని ఆ పాశురంలోని"ఎంగళ్ మేల్ నోక్కుదియేల్ ఎంగళ్ మేల్ శాపమిళందు"( నీవు మమ్ములను కటాక్షిస్తే మా శాపం తీరిపోతుంది) అనే సూక్తులు వ్యక్తం చేయబడింది. పరమాత్మ అనుగ్రహిస్తే తప్ప మన పాపం పోదు. అందుచేత భగవంతుడు మనలను స్వీకరించడమే ముఖ్యమైన విషయం. మనం భగవంతుని ఆశ్రయించడం అనేది పరగత స్వీకారంతో పోలిస్తే ముఖ్యం కాదు. వేదం కూడా"యమేవైష వృణుతే తేన లభ్యః"( ఎవడు భగవంతుని కటాక్షిస్తాడో అతనికే ఆ భగవంతుడు లభిస్తాడు) అని తరగత స్వీకార ప్రాధాన్యాన్ని "ఏవ" అనే అవధారణతో పలికిందికదా.

*55)కర్తవ్యం కర్మ సర్వం యది భవతి ఫలే కామనా నైవ చిత్తే*
*కర్తవ్యం నైవ కించిత్ యది మనసి ఫలే సక్తిరిత్యాహ కృష్ణః,*
*ఏనం గీతార్థసారం సుమధుర ముదితం గీతికాయాం వ్రతేస్మిన్*
*ఏకాదశ్యాం వచోభిః శ్రుతియుగసుభగైః పద్యకే ద్వాదశే చ.*

శాస్త్రవిహితమైన ఏ కర్మ అయినా ఫలాన్ని ఆశించి చేయకపోతే, అది కర్తవ్యమే. ఏ కర్మ అయినా, అది ఫలాన్ని ఆశించి చేసినట్లైతే కర్తవ్యం కాదు అనేది శ్రీకృష్ణుడు

గీతలోని చేసిన ఉపదేశం. ఈ గీతార్థ సారాన్ని గోదాదేవి చాలా అందంగా, వినడానికి సొంపైన మాటలతో తిరుప్పావై ప్రబంధంలోని పదకొండవ, పన్నెండవ పాశురాలలో వ్యక్తం చేసింది. 11 వ పాశురంలో భగవత్సేవారూపంగా తన వర్ణానికి అనుగుణమైన గోపాలనాన్ని చేసే భక్తుని వృత్తాంతం . 12 వ పాశురంలో భగవానుని కైంకర్యమే ప్రధానంగా భావించి, మిగిలిన కర్మలను విడిచి పెట్టిన గోపాలుని వృత్తాంతం ప్రస్తావించడం ద్వారాఈ శాస్త్రార్థం నిరూపింపబడినది అని పెద్దల వ్యాఖ్యానం.

*56))గోదోక్త వ్రతపాలనాత్ విమలవాక్, కాంతిః మనఃకాయయోః*
*శుద్ధా ధీరపి, కృష్ణపాదయుగళే భక్తిః ప్రపత్తి స్తథా,*
*కైంకర్యం హరిసన్ని ధౌ ఫలతి నో నిత్యం తదేతద్వ్రతం*
*గోభూసస్యజలాదిసర్వఫలదం గోదాసమానం విదుః .*

గోశబ్దానికి సంస్కృతంలో పలు అర్థాలు తెలుపబడ్డాయి. స్వర్గం, బాణం, గోవు, వాక్కు, వజ్రం, దిక్కు, నేత్రం, కిరణం, భూమి, జలం అని అమరకోశంలో గోశబ్దానికి పది అర్థాలు చెప్పబడ్డాయి. వీటిని అనుసరించి గోదా అనే పదానికి పరమ పదాన్ని అనుగ్రహించేది, గో సంపదను అనుగ్రహించేది, చక్కని వాక్కును అనుగ్రహించేది, మోక్షోపాయాన్ని అనుగ్రహించేది, మంచి జ్ఞానాన్ని అనుగ్రహించేది, మంచి వాక్కును ఇచ్చేది, మనసుకు, శరీరానికి శోభను కలిగించేది, భూమిని, జలాన్ని, వర్షాన్ని అనుగ్రహించేది అని పలు అర్థాలు చెప్పవచ్చు.

గోదాదేవి మనకు ఉపదేశించిన తిరుప్పావై వ్రతాన్ని ఆచరించడం వల్ల కూడా పైన తెలిపిన ప్రయోజనాలన్నీ కలుగుతాయి. తిరుప్పావై వ్రతం ఆచరించినందున భగవదనుగ్రహం కలిగి, అందువల్ల పరమపద ప్రాప్తి కలుగుతుందని గోదాదేవి చివరి పాశురంలో పలికింది. అంతేకాక , మూడవ పాశురంలో ఈ వ్రతాన్ని ఆచరించడం వల్ల వర్షసిద్ధి , సస్య వృద్ధి, గోవృద్ధి , దానివల్ల భూమిలో ఏ కీడు లేకుండా ఉండడం మొదలైన ప్రయోజనాలు కలుగుతాయని చెప్పింది. ఈ వ్రతం భగవంతుని ఉద్దేశించి చేయబడే వ్రతం కనుక, మంచి జ్ఞానం, దానివల్ల భగవంతుని విషయంలో భక్తి, ఈ వ్రతం శరణాగతి

రూపం కనుక, భగవంతుని పాదాలలో ప్రపత్తి సిద్ధిస్తాయి, రెండవ పాశురంలో ఉపదేశించిన రీతిగా చక్కని ప్రవర్తన కూడా సిద్ధిస్తుంది.

ఈ విధంగా గోదాదేవి వల్ల ఎన్ని ప్రయోజనాలు సమకూరుతాయో, అవి అన్ని తిరుప్పావై వ్రతం వల్ల సిద్ధిస్తాయి. అందుచేత తిరుప్పావై వ్రతాన్ని గోదాదేవితో సమానంగా పెద్దలు భావిస్తారు.

*57) గీతాయాం కర్మయోగం ప్రథమ ముపదిశన్ జ్ఞానయోగం చ పశ్చాత్*
*కృష్ణో భక్త్యాఖ్యయోగం తదుపరి చరమం ప్రాహ న్యాసం తదంతే,*
*గోదాప్యేతానుపాయాన్ క్రమమిమమనుసృత్యాత్ర కర్మ ద్వితీయే*
*పంచమ్యాం జ్ఞానయోగం క్రమశ ఉపదిదేశాత్ర భక్తిప్రపత్తీ.*

భగవద్గీతాశాస్త్రంలో శ్రీకృష్ణ భగవానుడు మొదట కర్మయోగాన్ని, ఆ తరువాత జ్ఞాన యోగాన్ని, అనంతరం భక్తి యోగాన్ని, చివరిలో ప్రపత్తి యోగాన్ని ఉపదేశించాడు, గోదాదేవి కూడా ఈ క్రమాన్ని అనుసరిస్తూ, తిరుప్పావైలో రెండవ పాశురంలో కర్మయోగాన్ని" నెయ్యుణ్ణోమ్" ఇత్యాదిగా ఉపదేశించింది. ఐదవ పాశురంలో " తూయోమాయ్"అని జ్ఞాన యోగాన్ని తెలిపింది. ఆ తర్వాత పది పాశురాలలో అనేక విధాలుగా ఉండే భక్తి దశలను నిరూపించి భక్తి యోగాన్ని తెలిపింది. ఇక 16వ పాశురం నుండి చివరి వరకు శరణాగతిని వివరించింది. ఇది కూడా గీతా శాస్త్రక్రమమే కదా.

*58) షష్ఠే గీతే ప్రసక్తిః సితదరనినదస్యాత్ర సందృశ్యతే యా*
*వ్యంగ్యార్థప్రక్రియాయాం ప్రకరణవశతో భాంతి తస్యాః మహార్థాః,*
*శంఖస్యోంకారతత్త్వాత్ శ్రుతిరపి భగవద్గీతికా దివ్యసూరి*
*ప్రోక్తా దివ్యప్రబంధాః సహృదయహృదయైరత్ర సంభావనీయాః.*

తిరుప్పావై ప్రబంధంలోని ఆరవపాశురంలో "వెళ్లై వెళి శంగిన్ పేరరవమ్" అని అంటూ తెల్లని శంఖం చేసే ధ్వని ప్రస్తావింపబడింది. ఈ ప్రయోగంవల్ల ప్రకరణాన్నిబట్టి ధ్వనిప్రక్రియలో గొప్ప అర్థాలు ప్రకాశిస్తున్నాయి. శంఖం ప్రణవ స్వరూపం కనుక, ఇక్కడ

# తిరుప్పావై వైభవం

శంఖించేసే ధ్వని అంటే వేదం, ఆ వేదార్థాన్ని అనువదించే భగవద్గీత, దివ్యసూరి ప్రబంధాలు మొదలైనవానిని ఇక్కడ సహృదయులు గ్రహించడం ఉచితం

*59)శంఖః తారస్వరూపీ, తదభిహితమహార్థో హి జీవస్వరూపమ్,*
*తత్ స్యాత్ పత్యుః శ్రియః శ్రీచరణకమలయోః మంగళోక్తిర్హి, తస్మాత్*
*షష్ఠే గీతేఽత్ర శంఖధ్వనికథనవశాత్ సూచితా భట్టనాథ*
*ప్రోక్తా పల్లాండునామ్నీ కృతిరితి రుచిరా భాతి రంగార్యసూక్తిః*

. శంఖం ప్రణవ స్వరూపం. ప్రణవం ద్వారా చెప్పబడే గొప్ప అర్థం ఏమంటే, జీవుని స్వరూపమే ఆ జీవుని స్వరూపం ఏమంటే, శ్రీమన్నారాయణుని శ్రీపాదాలలో మంగళాశాసనం చేయడమే కదా. అందువల్ల, తిరుప్పావై ప్రబంధంలోని ఆరవ పాశురం ప్రస్తావింపబడిన శంఖధ్వని వల్ల, ఓంకారార్థప్రతిపాదకమైన, భగవన్మంగళాశాసనరూపమైన, పెరియాళ్వార్ ల మొదటి ప్రబంధం పల్లాండు సూచింపబడింది– అనే శ్రీరంగాచార్యులవారి సూక్తి అందంగా ప్రకాశిస్తున్న ది. ( రంగాచార్యులవారు దాసుని తండ్రిగారు)

*60)సౌలభ్యం పరతేతి లింగయుగళం యద్బ్రహ్మణో దృశ్యతే*
*వేదాంతే, తదిహాపి దీవ్యతితరాం గోదావ్రతే సర్వశః,*
*నామ్నా మత్ర సమన్వయో యది కృతో నారాయణేత్యాదిమే*
*గీతే చేత్ పరిదృశ్యమానపదలో వ్యక్తం సమస్తం హి తత్.*

వేదాంత శాస్త్రంలో పరమాత్మకు పరత్వం, సౌలభ్యం అనే రెండు అసాధారణ గుణాలు చెప్పబడ్డాయి. వీటికి ఉభయ లింగాలు అని పేరు. తిరుప్పావై ప్రబంధంలో కూడా ఇవి స్పష్టంగా ప్రకాశిస్తున్నవి. ఏ విధంగా అంటే, ఈ ప్రబంధంలోని మొదటి పాశురంలో చెప్పబడిన నారాయణ నామంతో మిగిలిన పాశురాలలో కీర్తింపబడిన నామాలను అన్వయించుకుని అర్థం చెప్పుకొన్నప్పుడు ఈ విషయం స్పష్టం

అవుతుంది. మొదటి పాశురంలోని నారాయణ నామాన్ని పరమన్ అనే రెండవ పాశురంలోని నామంతో అన్వయిస్తే నారాయణుడే పరుడు అనే అర్థం వస్తుంది. ఇది పరత్వ సూచకం. ఆ విధంగానే, మూడవ పాశురంలోని ఉత్తమ నామంతో నారాయణ నామాన్ని కలిపి అర్థం చెప్పుకుంటే నారాయణుడే ఉత్తముడు అనే అర్థం వస్తుంది. ఇది సౌలభ్యం సూచకం. ఈ విధంగానే ఈ ప్రబంధంలోని అన్ని నామాలను నారాయణ నామంతో సమన్వయించి అర్థం గ్రహించినప్పుడు భగవంతుని పరత్వసౌలభ్యాలు అనే ఉభయలింగాలు స్పష్టం అవుతున్నాయి.

*61) వేదానాం బీజభూతే హరిపదవినతైః ప్రత్యహం పఠ్యమానే*
*శ్రీగోదాశ్రీప్రతేఽస్మిన్ నిరుపమరుచిరా భాంతి నైకే మహార్థాః,*
*దివ్యేష్వేష్వేవ కేచిదిహ మితమతినా ప్రస్తుతా చాపలా త్తత్*
*స్వారస్యాస్వాదనేఽతో గుణతదితరవిత్ సాహసం మే సహేత.*

"వేదమనైత్తుక్కుమ్ విత్తాకుమ్ కోదై తమిళ్ " అనే విధంగా గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధం సమస్త వేదానికి సంగ్రహం అని చెప్పదగినది. అటువంటి ఆ ప్రబంధాన్ని ప్రపన్నులు ప్రతి హదినం అనుసంధిస్తారు. దానిలో ఎన్నో సాటిలేని గొప్ప గొప్ప అర్థాలు ప్రకాశిస్తున్నాయి. ఆ అర్థాలలో ఏవో కొన్ని మాత్రమే ఇక్కడ చాలా పరిమిత జ్ఞానాన్ని కల దాసునిచే వాటిలోని మాధుర్యాన్ని అనుభవించాలి అనేచాపల్యంవల్ల, ప్రస్తావింపబడ్డాయి. అంతే తప్ప ఇవే అర్థాలు ఉన్నాయి అనే అభిప్రాయంతో మాత్రం కాదు. అందుచేత నేను చేసిన ఈ సాహసాన్ని గుణాలు ఏవో, దోషాలు ఏవో తెలిసిన పెద్దలు మన్నిస్తారు.

ఆండాళ్ తిరువడికళే శరణమ్.